# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100067521

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీకాళహస్తీశ్వర శతకము

మరియు

# జ్ఞాన ప్రసూనాంబ శతకము



కవయిత్రి :

శ్రీమతి మల్లాది పద్మావతి

# సరస్వతీ ప్రార్థన



బేగడ రాగం ఆది తాళం

బాసర జ్ఞాన సరస్వతీ - భాషా ప్రదాయినీ
నలువ దేవుని రాణి - నాద స్వరూపిణీ ॥బాసర॥

హస్తంబునందున - పుస్తక ముంచుకొని
జపమాల త్రిప్పుచు - జ్ఞానంబు పంచుదువు
కామదాయిని నిన్ను - కవిత ల్లుచును
భజన చేయుదాన - భావ సంపద నొసగు ॥బాసర॥

స్వర రాగ శ్రుతి లయలు - సర్వము నీవె గద
సర్వ కళల స్వరూప - సామ వేద రూప
స్వరము లల్లి నిన్ను - సన్నుతించెద నమ్మ
స్వరము నీయుము తల్లి - సంకీర్తనలు జేతు ॥బాసర॥

వీణా వినోదినీ - విద్యాధి దేవత
వాగీశ్వరీ దేవి - వర ప్రదాయినీ
పలు రీతుల నిన్ను - ప్రస్తుతించెద నమ్మ
పద్మావతికి నెపుడు - పదము లందింపుమా ॥బాసర॥

(ది. 8-1-2000 నాడు నగర కేంద్ర గ్రంథాలయము, చిక్కడపలి, హైదరాబాదులో సూర్యశక్తి ఇంటర్నేషనల్, వాసవీ నగర్, సికింద్రాబాదు వారి [redacted]డిన "శ్రీ జ్ఞాన సరస్వతి కవితామృతలహరి కవి పండిత సదస్సు[redacted] గీతం గానం చేయ[redacted]
ACC కవయిత్రి)

బృహత్ ద్విసహస్రావధాని – బ్రహ్మశ్రీ
**డా. మాడుగుల నాగఫణి శర్మ**
ఎం.ఎ., పిహెచ్.డి.
అధ్యక్షులు

అధికార భాషా సంఘం
సంప్రీతి (ఎల్. బ్లాకు) భవనం
సచివాలయం, హైదరాబాదు.
దూరవాణి :
✆ కార్యా : 3452339
230111/2798
ఇల్లు : 7567726

లేఖ సంఖ్య : 48/ అధి. భా. సం. /99, 15.11.99

"పూని రక్షింపు, జ్ఞాన ప్రసూన దేవి" అన్న మకుటంతో జ్ఞాన ప్రసూనాంబికా దేవిని, " కాళహస్తి వాస కావు మీశ" అన్న మకుటంతో కాళహస్తీశ్వరుని శతక సంస్తుతులతో అర్చించారు రచయిత్రి మల్లాది
పద్మావతి దేవి గారు.

పద్యాలు, కథలు, నవలలు అనేకముగా ఈపాటికే వ్రాసి ప్రసిద్ధిని సాధించిన పద్మావతి గారు సిద్ధి సాధనకై పార్వతీ పరమేశ్వర స్తుతి ఇప్పుడు చేస్తున్నారు.

అకుంఠిత సారస్వత తపస్సు చేసిన పద్మావతి గారి రచన మాతృ హృదయం వలె ప్రసన్నమై, లలితమై, సులభమై, సులభావగాహమై అలరారుచున్నది.

మల్లాది వంశ వార్నిధి
వేల్లిత పీయూష కలశ వృత్తికి, విద్యా
వల్లికి, పద్మావతికిని
అల్లన గౌరీ మహేశు లఖిలము లిడుతన్

**మాడుగుల నాగఫణి శర్మ**

**Dr. ACHARYA TIRUMALA**

301, Nandini Complex,
Mojamjahi Market,
Hyderabad - 500 095, A.P.
Phone : 4619066

## సు - వర్ణముఖి

మనిషిగా పుట్టిన తర్వాత అనంతమైన ఈశ్వరానుభూతిని చవి చూడక పోతే, ఎన్ని ఘన కార్యాలు సాధించినా ఆ పుట్టుక వ్యర్థమైపోయిందనే అనుకోవాలి. "ఇల పుట్టుచు చచ్చుచు మోహ వార్ధిలో దిరుగుచు నుండు గాని యొక తీర్థము జేరదు జీవుడెన్నడున్ " అని భాగవతంలో చెప్పినట్టు, ఏదో జన్మతో ఈ భూమి చుట్టూ తిరుగుతూనే ఉండాలి. ఈ దురవస్థనుండి మనిషిని దాటించడానికే తపస్సంపన్నులైన ఋషులు మనకు పరమ శ్రేయో దాయకమైన వైదిక మార్గాన్ని చూపించారు. వేద శాస్త్ర పురాణాల్లో నిర్దేశింప బడిన ఆత్మోద్ధరణ మార్గాన్ని అన్వేషించి ప్రతి మనిషి తన జన్మను సార్థకం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

జ్ఞాన - కర్మ - భక్తి మార్గాల్లో భక్తికి చాలా ప్రాధాన్యముంది. భక్తి - ఉపాసనా మార్గం. అందుకే భగవద్గీతలో కూడా భక్తిని ఒక యోగంగా భగవానుడు ప్రతిపాదించాడు. ఆ యోగ ప్రభావంతో ఎన్నో మతాలు వెలిసాయి. శైవ - వైష్ణవాలు విజృంభించాయి. శైవం ప్రాధమికంగా చాల దార్ఢ్యాన్ని సంతరించుకుంది. "శివార్పితం నాస్తి" - శివునకు మించింది యేమీ లేదన్నది శైవం. తెలుగు సాహిత్య చరిత్రలో ఒక శివ కవి యుగమే నడిచింది. పండితారాధ్య, బసవేశ్వర, పాల్కురికి సోమనాధాదులే కాదు. శ్రీనాధుడు, ధూర్జటి వంటి వారు కూడా శైవాన్ని సముద్ధరించారు. ధూర్జటి రచించిన శ్రీ కాళహస్తీశ్వర శతకానికి మించిన శతకం నేటికీ శైవ సాహిత్యంలో లేదని నా అభిప్రాయం. ఆ ఆత్మనివేదన అంత గాఢంగా ఉంది.

ఆధునిక కాలంలో శైవ శతకాలు చాలా వచ్చినా శ్రీమతి మల్లాది పద్మావతి గారు రచించిన యీ శతక ద్వయం కూడా భక్తి భావ బంధురంగా హృద్యంగా ఉంది. ఆట వెలదుల్లో శ్రీ కాళహస్తీశ్వరుని, తేటగీతుల్లో జ్ఞాన ప్రసూనాంబను పద్మావతి గారు అర్చించిన తీరు ప్రశంసనీయంగా ఉంది.

పద్మావతి గారు వినయశీలి. శ్రీ వేంకటేశ్వర సంకీర్తనలు, శ్రీరామ శతకం, పద్మావతి కథలు, ఆఖరి విజయం వంటి అనేకానేక రచనల ద్వారా పేరు కెక్కిన పద్మావతి గారు – "సకల శాస్త్రంబులందున సాటిలేని, తండ్రి నరసింహ శాస్త్రిని దలచి" వారి దీవెనలు పొంది "శాస్త్ర పరిచయంబు చాలినంతగ లేదు" అనుకుంటూ ఆత్మార్పణంగా ఈ రచన సాగించారు. ఆ ఈశ్వరుని "మనసు కుదురునట్టి మార్గంబు దెల్పవే" అని వేడుకున్నారు. కన్నప్పని చూస్తూ, తన శక్తిని తాను అంచనా వేసుకుంటూ –

పట్టు వడవ దెట్టి పరమ యోగులకైన
ఎఱుక వానికెట్లు దొరికి తీవు !
పట్టు కొనుట నిన్ను పద్మావతికి నౌనె ?
కాళ హస్తి వాస, కావు మీశ !

అని ప్రార్థించారు. అంతే కాదు, "తన్ను తా నెరిగెడు తత్వంబు నీగదే !" అనీ, "విశ్వ మీవ యనెడి విజ్ఞాన మొసగుమా !" అనీ అంజలి ఘటించారు. ఈశ్వరానుభూతికి భక్తి ఒకటే మార్గమనే జ్ఞానంతో శతక రచన చేస్తూ చివరికి "భక్తి లేక నిన్ను పట్టంగ నేర్తురే ?" అని వితర్కించారు.

పద్మావతి గారు శ్రీకాళహస్తీశ్వరుని నామరూప విభవ వర్ణనతో బాటు జ్ఞాన ప్రసూనాంబను కూడా తనివి తీర స్తుతించారు. అమ్మవారి వివిధ రూపాలు, అవతారాలు, మహిమలు, దయాదాక్షిణ్యాది మాతృ గుణాలు వర్ణిస్తూ, పూని తనను రక్షింపు మని వేడుకున్నారు. ఆమెను 'ఆత్మ విద్యా స్వరూపిణి'గా అభివర్ణించారు. ఆగమ శాస్త్రాల్లో చెప్ప బడిన అగ్ని దుర్గను, జయ దుర్గను నవదుర్గల్లో ప్రస్తావించి, జ్ఞాన భిక్షను ప్రసాదింపమని అర్థించారు. షోడశోపచార విధితో ఆ జగన్మాత జ్ఞాన ప్రసూనాంబకు జోల పాడి నిద్రబుచ్చి, ప్రభాతాన మేలుకొలుపు పాడారు. ఈ విధమైన ప్రవర్తనకు త్యాగరాజ స్వామి గుర్తుకు వస్తాడు. ఆయనైతే రాముడికి తాంబూలమిచ్చి పక్కమీదికి రమ్మంటాడు. ఆ పారవశ్యం అంతటిది; అది అక్షరాలకు ఇమడదు.

పద్మావతి గారి శైవ ధ్యానం ఈ రెండు శతకాల్లోనూ పరాకాష్ఠకు చేరింది. ఏ పద్యాన్ని చూచినా హృదయాన్ని ఆవిష్కరించటమే తప్ప ఏ భేషజమూ కనిపించదు. ఆ మార్గమే మోక్ష ప్రాప్తికి తిన్ననైనది. అదే తిన్నడి దారి. పద్మావతి ఆ దారిలో ఉన్నారు. సంతోషంతో అభినందిస్తున్నాను.

భక్త పరమాణువు

12-12-99. ఆచార్య తిరుమల

"కళా ప్రపూర్ణ"
డా. పోతుకూచి సాంబశివ రావు
కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులు

1-3-1/18, కవాడిగూడ
సికింద్రాబాదు - 80
ఫోను నెం. 7533177

# భక్తి తొణికిన పద్యరత్నాలు

మల్లాది పద్మావతిగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. వచనం, గద్యం ఆమెకు కరతలామలకం. రెండింటిలోను తన ప్రతిభా పాటవాలు చూపిస్తున్న విదుషీమణి.

కాళహస్తీశ్వర శతకం, జ్ఞాన ప్రసూనాంబ శతకం ఈ గ్రంథంలో వున్నాయి. ఆటవెలది, తేటగీతి ఆమె కవితా ధారలో వెలువడిన అమృత గుళికలు. పద్యం వ్రాయడం అంత కష్టం కాకపోయినా భావ స్ఫూరితంగా వ్రాయడం పద్మావతిగారికే చెల్లింది. భక్తిపరమైన, సామాజిక స్పృహతో వ్రాసిన పద్యాలు ఈ గ్రంథంలో కనిపిస్తున్నాయి. వచనంలో మునుగుతున్న నేటి కవితాయుగంలో పద్యాల జండా నెగురవేయడం సనాతనులకు, ఆధునికులకు కూడా గర్వకారణం.

పద్యాలు రచించడంలో "అవర మొల్ల" గా భాసించగలరు. శ్రీ కాళ హస్తీశ్వరుని గురించి అనేక ఆధ్యాత్మిక గాథలున్నవి. శివుడు భోలా శంకరుడు, భక్తులకు నిత్య సన్నిహితుడు, వరదుడు కూడ. అటువంటి శ్రీ కాళహస్తీశ్వరుని, జ్ఞాన ప్రసూనాంబను ప్రస్తుతించిన మల్లాది పద్మావతి ధన్యురాలు. శతక సాహిత్యం ఆధునిక యుగంలో కూడ జనరంజక మవుతున్నది. అందువల్ల పద్మావతిగారి శతకాలు, శతక వాఙ్మయానికి మకుటాలుగ వర్ధిల్లాలని, పాఠకులు, భక్తులు వేనోళ్ల పలికి చిరంజీవులు కావాలని నా హృదయపూర్వక ఆకాంక్ష.

డా. పోతుకూచి సాంబశివ రావు

**Dr. Vasa Prabhavathi** M.A., Phd.
Poetess & Writer
Regional Film Censor Board Member
Reader & Head, Dept. of Telugu
Vanitha Maha Vidyalaya (Ret)

✆ : (Resi) 4549178
Vasa Nilayam
11/2RT, Municipal Colony
Malakpet, Hyderabad - 500 036

Date : 18-11-99.

# హృద్యమైన శతక పద్యానికి స్వాగతం

తాళ్ళపాక తిమ్మక్కతో ప్రారంభమై మొల్ల రామాయణంతో తెలుగు నేలంతా గుభాళించింది మహిళా కవిత్వం. నేటికీ మూడు పువ్వులు ఆరు కాయలుగా విరాజిల్లుతోంది.

కావ్య రచన కాకపోయినా, తిమ్మక్కకు ముందుగానే ఖడ్గ తిక్కన భార్య చానమ నోటినుండి వెలువడిన కందమే మహిళా కవిత్వానికి ఆద్యంగా గుర్తింపబడింది.

కందువ మాటల సామెత
లందముగా గూర్చి చెప్ప నది, తెలుగులకున్
బొందై రుచియై వీనుల
విందై కానుపించు విబుధుల మదికిన్

తెలుగు భాషా మాధుర్యముపై మొల్ల మమకారమే కాదు, తెలుగు కవయిత్రు లందరి తెలుగు మమకారాన్ని తెలియ చెబుతుందీ పద్యం.

మంగళ హారతులను రచించిన బాల పాపాంబ వంటి ప్రాచీన కవయిత్రు లెందరో తెలుగు సాహితికి వన్నెలు చిన్నెలు చేకూర్చారు. 1833 నాటికి భావలింగ శతకమును రచించి శతక రచనకు శ్రీకారము చుట్టిన సుందరీమణి శ్రీమతి దార్ల సుందరీమణి. భగవంతుని సాక్షాత్కారములోని పరమానందాన్ని పాఠక లోకానికి అందించిన కవితా మూర్తి ఆమె.

కటిక వానికైన గాల్ మ్రొక్క వచ్చును
సోమయాజి ముఖము చూడ రాదు
పాటుడైన వాడు పశువుల జంపునా
పాప భయ విభంగ భావ లింగ !

యజ్ఞ యాగాదులలో పశు వధను తేలికైన మాటలలోనే విమర్శించిన ఆధ్యాత్మిక తత్వవేత్త ఆమె. 120 ఆటవెలదులతో శతక రచన చేసిన శిల్పచాతుర్యము గలిగిన పాండిత్యమామెది.

తడికొండ వెంకమాంబ తన ద్విపద భావగతంలో తన పాండిత్య రచనా వైభవాన్ని ప్రకటించింది.

కొలకలపూడి సీతమ్మ గారితో నేటి మహిళా కవితాయుగము ప్రారంభమైనదని చెప్పవచ్చు. ఈమె రచించిన అహల్యాబాయి, పద్య భగవద్గీత, మొదలైన ప్రసిద్ధమైన రచనలలో సాధు రక్షక శతకము విలక్షణమైనది.

కోపము మెండు నాకెపుడు, కుచ్ఛిత బుద్ధి యఖండ వృత్తితో
కాపురముండు, నా మదిని గల్మషమింక నశింపదయ్యె, నా
పాపపు జిత్త వృత్తులను భస్మము చేయగదయ్య వేగ సం
తాప హరుండ ! భక్త వరదా, శరణా గత ! సాధు రక్షకా !

ఉత్పలమాలలో సాగిన ఈ శతక పద్యాలలో ఆధ్యాత్మిక చింతనతో కూడిన ఆత్మ పరిశీలన వ్యక్త మవుతుంది. ఈ భౌతిక ప్రపంచంలో ఒక కవయిత్రి చెప్పగలిగిన ఉత్కృష్టమైన విషయం మరేముంటుంది ! మహిళలు ఋషి తుల్యులే కదా !

శతక రచనలో దిట్ట బుర్రా సూరమాంబ గారు. ప్రహ్లాద నాటకము, శ్రీకృష్ణబోధామృతము, సావిత్రీ విజయము మొదలైన గ్రంధాలతో పాటు వీరు రచించిన హరినాధ శతకము, నందనార శతకము పేర్కొన దగినవి. వేమూరి శారదాంబ గారి మాధవ శతకములో స్త్రీ విద్యా విహీనతను గూర్చిన అనేక విషయాలు ప్రస్తావించ బడ్డాయి. సీరము సుభద్రాయంబ గారి శ్రీ వేంకటేశ్వర శతకము, శ్రీ రామ శతకము పేర్కొన దగినవి. అదే విధంగా 1895 లో జన్మించిన శ్రీమతి జ్ఞానాంబ గారి సత్ప్రభు శతకము, పులుగుర్తి లక్ష్మీ నరసమాంబ గారి మంగళ హారతుల శతకము, దొంతి రాజరత్నమ్మ గారి శ్రీ జనార్ధన శతకము, కాంచన పల్లి కనకాంబ గారి రంగ శతకము, గుడిపూడి ఇందుమతీదేవి గారి తరుణీ శతకము, శ్రీమతి జొన్నలగడ్డ శారదాదేవి గారి లక్ష్మీ, శారదా శతకములు, శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి చెన్నకేశవ శతకము, జ్ఞాన ప్రసూనాంబికా శతకము, శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మ గారి భారత కృష్ణ శతకము, శ్రీమతి ఆత్మూరి అన్నపూర్ణమ్మగారి కుమార శతకము, శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారి కాంతా శతకము, శ్రీమతి మాణిక్యం వేదవల్లీ తాయారమ్మగారి రామ శతకము, శ్రీమతి చుండూరు రమాదేవి గారి రాఘవేశ్వర శతకము, తెలుగు సాహిత్యానికి అలంకారములు. స్వర్గీయ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారి కలం నుండి అనేక పద్య రచనలు వెలువడ్డాయి. పద్య రచనలలో ఆమెకు ఆమే సాటి.

ఒక ప్రక్క వచన కవిత్వం ప్రచారములో ఉన్నప్పటికీ మరో ప్రక్క పద్య కవిత్వం కొనసాగుతూనే ఉంది. నేటి కాలంలో శతక రచన చేస్తున్న కవయిత్రులు ఎందరో!

ఇటీవల చిల్లంగి స్వరాజ్య లక్ష్మి గారి పంచశతి శతక కావ్యంలో, 1) రక్ష సేయ రమ్మ రాఘవేంద్ర, 2) చల్లగాను చూడు సాయినాథ, 3) కన్న తండ్రి నన్ను కరుణ జూడు, 4) రాజుగారి మాట రాచ బాట, 5) బ్రతుకు బాటసారి బరువదేల – అను 5 శతకాలు చోటు చేసుకున్నాయి. ఆధ్యాత్మిక భావ తన్మయత్వమే కవిత్వమై శతక రూపం ధరించిన కవిత్వమది. సున్నితమైన పదజాలంతో లోతైన ఆధ్యాత్మిక భావం చోటు చేసుకున్న కవిత్వ మామెది.

ఈ నాడు శ్రీమతి మల్లాది పద్మావతిగారి కలం నుండి వెలువడిన 2 శతకములు ఉత్తమ మహిళా శతక రచన కోవకు చెందినవే. నిండు వయస్సులో ఒక మొల్లలా, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మలా పద్య రచన చేయడం ముదావహం. ఒక పక్క పద్య రచన అంతరిస్తున్న సమయంలో వీరి రచనలు మహిళా శతక రచనకు ఊపిరి పోస్తున్నాయి.

వీరి జ్ఞాన ప్రసూనాంబ శతకము, శ్రీ కాళహస్తీశ్వర శతకము, శతకానికే వన్నె తెచ్చే రచనలు. మృదుమధురమైన పదజాలంతో వీరి వర్ణనలు, వీరి శైలి, పఠితల హృదయాలను పరవశింప చేస్తాయి.

ఘల్లు ఘల్లంచు పాదాల గజ్జె మొరయ
ముక్కునందున మెరసెడి ముక్కరయును
చూడ ముచ్చట రూపమ్ము చూపరులకు
ఫూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

చిన్నచిన్న వాడుక పదాలలో కొండంత అర్థాన్ని చూపగల భవనా శక్తి ఈ కవయిత్రి సొత్తు. లౌకిక దృష్టి కాకుండా అలౌకికమై, వేదాంత వేద్యమైన భావన ఈ రచయిత్రికో వరం. పూని రక్షింపుము అంటే అలౌకికమైన మోక్ష మార్గమే అన్ని శతక పద్యాలలో గోచరిస్తుంది.

అభయ హస్తమ్ము జూపి నీ వఖిల జనుల
గాచు జగదాంబ నీ కన్న గలదె జగతి!
నెంచి నీ చెంత జేరితి నేలు మమ్మ
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

ఇందులో జ్ఞాన ప్రసూన దేవి మకుటంతో తాను ఎన్నుకున్న విషయాన్ని తెలియ చెప్పారు కవయిత్రి.

వాణి వరలక్ష్మి ! గిరి పుత్రి ! వాగ్విలాస !
ముగ్గురంబల మూర్తివి మోక్ష దాయి !
శక్తి రూపివి సేవింతు భక్తి గొలుతు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

జ్ఞాన ప్రసూన దేవి వర్ణన లక్ష్మి, సరస్వతి, పార్వతి, అను ముగ్గురమ్మల శక్తి స్వరూపిణి అనే అంశం ప్రస్తావించారు. ఇది జ్ఞాన ప్రసూనా దేవి స్తుతి యైన రకరకాల కోణాలలో ఆ అంబ గొప్పదనాన్ని కీర్తించడంలో పద్మావతిగారి కలానికో ప్రత్యేకతను చూపుతోంది. ఆధ్యాత్మిక భావనా చింతనకు పేరెన్నిక గన్న మహిళ పద్మావతి గారు. హృదయ సంస్కారము సంపూర్ణముగా గల మహిళ ఆమె. ఆ భావమే మనకు ఈ శతకంలో అడుగడుగునా గోచరిస్తోంది.

కోటి దేవతలు నిన్ను కూర్మి మీర
పూజలను జేసి కొలచిరి పూత చరిత
జనని ! నిను గోరి వచ్చితి ననునయింపు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

కవయిత్రి భావుకత ఇందులో స్పష్టంగా గోచరిస్తోంది. దేవతలందరికీ ఆరాధ్య దైవం ఆ అంబ. ఆమే జ్ఞాన ప్రసూన దేవి. ఆమె పద్మావతి గారికీ ఆరాధ్య దైవమే. అందుకే రక్షింపమని వేడుకుంటోంది. అడుగడుగునా ఈమె రచనా శక్తి ద్యోతకమవుతోంది.

మరొక శతకం శ్రీకాళహస్తీశ్వర శతకము. ఎందరో కవులు శతక రచన చేసిన వారే. శ్రీకాళహస్తీశ్వర శతకము సుప్రసిద్ధము. కాని, ఈ మహిళ తేటయైన తెలుగు మాటలతో రచించి ప్రత్యేకతను చూపారు --

శ్రీగిరీశ ! నిన్ను సేవించి పూజించి
కలము చేత బట్టి దలచినాను
భవుడ నాకు వేగ భాష నందింపుమా !
కాళ హస్తి వాస కావు మీశ !

ఈ శతకంలో తాను శతక రచన చేయడానికి గల కారణాన్ని మొదటి పద్యంలో వర్ణించారు.

నన్ను గన్న తండ్రి నాయందు నీవుండి
యాటవెలదులల్ల నాజ్ఞ నొసగ
నాది మిమ్ము దలచి యఘ దూర నగుదును
కాళ హస్తి వాస కావు మీశ!

ఈమె చెప్పిన విషయం యదార్థం. బలవంతంగా రాసిన ఆటవెలదులు గావు. ఆ భగవంతుని కరుణ వల్ల జాలువారిన రచన ఇది. భగవంతునికి భక్తునికి మధ్య గల సంబంధమే అది. ఈ శతకంలో భగవంతుని స్వరూపము, భగవంతుని సేవ, ఆయనకు ఆరగింపు మొదలైన భక్తుని హృదయాన్ని వర్ణించిన తీరు పాఠక లోకాన్ని ఆకట్టుకొంటుంది. శతక రచనలో దిట్ట పద్మావతి అని అనిపించుకున్నారు. అందరూ చదువ దగిన పద్య రచన యిది. ఆబాల గోపాలాన్ని అలరించే భావ పరంపర ఇది.

పద్య రచన అరుదైన ఈ కాలంలో రెండు శతకాలను రచించి ఆంధ్ర పాఠక లోకానికి అందించిన శ్రీమతి మల్లాది పద్మావతి గారిని మనసారా అభినందిస్తున్నాను. శతక రచనలో ఈమె స్థానం తెలుగు సాహిత్యంలో ప్రముఖ స్థానంగా నిలవాలని మరిన్ని శతక రచనలు చేసి తెలుగు వారికి అందించాలని కోరుకుంటున్నాను. కవయిత్రి పద్మావతి గారికి నా కళాభివందనాలు అందిస్తున్నాను. తెలుగు వారందరూ చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

వాసా ప్రభావతి

విద్వాన్ పణతుల రామేశ్వర శర్మ
యమ్.ఎ., బి.ఇడి.

తెలుగు విభాగము
ప్రభుత్వ యువ కళాశాల
పలమనేరు

పుత్ర వాత్సల్యము గల శ్రీమతి మల్లాది పద్మావతి గారు తాను రచించిన శ్రీకాళహస్తీశ్వర శతకము, జ్ఞాన ప్రసూనాంబ శతకములను ఆమూలాగ్రముగ చదివినాను. అమేయమైన రచనా చాతుర్యముతో ఇన్ని ప్రక్రియలలో రచనలు చేయడం మెచ్చుకో దగ్గ ప్రజ్ఞయే !

భక్తి భావప్లావితమైన హృదయముతో ఆ యాది దంపతులను ఆటవెలదుల లోను, తేటగీతికలలోను నివేదించుట ఎంత ఆశ్చర్యమో, అంత ఆనందము. నిష్కల్మష మైన భక్తి, నిస్తులా వేదనము, నిరవద్య భావావేశము పొందింప బడినవి.

శ్రీ కాళ హస్తీశ్వర శతకము సరళ సుందరమై యలరారినది --

మంచి వాడు నిలను – మన్నన బొందును
గుణము మిన్న చూవె – కులము గాదు
సత్ప్రవర్తనంబు – సత్ఫల మిడుచుండు
కాళ హస్తి వాస – కావు మీశ !

ఈ విధమైన ఆదర్శమగు నీతి, నియమముతోను, భక్తి భావముతోను ఈ రెండు శతకములు నిండి యున్నవి.

వయసు మళ్ళినను, వెనుకంజ వేయకుండ వ్రాస్తున్న శ్రీమతి మల్లాది పద్మావతి గారు ఉత్తమ శ్రేణి కవయిత్రి అనుటలో సందేహము లేదు. పార్వతీ పరమేశ్వరులు ఈమెకు చక్కని సామర్థ్యము ప్రసాదించు గాక యని వేడుకొనుచున్నాను.

పలమనేరు,
10-11-99.

పణతుల రామేశ్వర శర్మ

**C. LALITHA SASTRY**
ATTORNEY AND COUNSELLOR AT LAW
*Chief Advisor,*
Rayalaseema Foundation Charitable Trust

*3-6-539/A, Street No. 7,*
*Himayathnagar*
*Hyderabad - 500 029*
*INDIA*
*Phone : 040-7633638*

శ్రీమతి మల్లాది పద్మావతిగారు రచించిన శ్రీకాళహస్తీశ్వర, జ్ఞాన ప్రసూనాంబ శతకాలను చదివేను. పద్మావతిగారు నవలా రచయిత్రిగా, కథా రచయిత్రిగా, జర్నలిస్టుగా, శతక రచయిత్రిగా ఆంధ్ర లోకానికి చిరపరిచితురాలు. ఆమె రచించిన శ్రీరామ శతకం చక్కని ప్రజాదరణ పొంది సాహిత్యలోకంలో ప్రశంసల నందుకొన్నది.

ఆమెచే రచింపబడిన శ్రీ వేంకటేశ్వర సంకీర్తనలను ప్రముఖ గాయని శ్రీమతి మాలతీ పద్మనాభన్ త్యాగరాజ గాన సభలో గానంచేసి సభికులను ముగ్ధులను చేసేరు. అలాగే దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ మీద ఆమె వ్రాసిన బుర్రకథ కేసెట్టును ఇటీవల జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, రాజ్యసభ సభ్యులు అయిన సి. నారాయణరెడ్డి గారు ఆవిష్కరించడం ఎంతో సంతోష దాయకం.

శ్రీమతి పద్మావతిగారు శ్రీకాళహస్తీశ్వర, జ్ఞానప్రసూనాంబ శతకాలను ఏక కాలంలో రచించి ఆ ఆది దంపతులను భక్తిభావంతో కొలిచేరు. ఈ కవయిత్రి "జ్ఞానమును గోరి జపము చేయు"నట, "శక్తికొలది శక్తి స్వరూపిణిని కొలుచు"నట. అపారమైన భక్తి భావంతో తన్మయత్వం పొంది ఆ సర్వ శక్తి స్వరూపిణిని ఆరాధిస్తూ తన శక్తికొలది పూజిస్తానని విన్నవించుకున్నారు. "మనసు కుదురునట్టి మార్గంబు దెల్పుమా" అంటూ దీనురాలై ఆ దీన బాంధవులైన ఆది దంపతులను అర్థిస్తున్నారీ కవయిత్రి.

ఆమె పాదములకు నమస్కరిస్తూ, ఆ శ్రీకాళహస్తీశ్వర దంపతులు ఈ కవయిత్రి కోరికను తీరుస్తారని ఆశిస్తూ ....

— సి. లలితా శాస్త్రి

# గ్రంథ సమీక్ష

దక్షిణ కాశీ యని ప్రసిద్ధి గాంచిన శ్రీకాళహస్తిలో వృత్తి రీత్యా సుమారు18 సంవత్సరములు వుండడం నా పూర్వ జన్మ సుకృతమని భావిస్తున్నాను. తరచు ఈశ్వరుని, జ్ఞాన ప్రసూనాంబను దర్శనం చేసుకుంటూ వుండే దానిని. భక్త్యావేశంతో నా హృదయము నుండి వెలువడిన ప్రపత్తి పూర్వక కుసుమాలను అక్షర రూపంలో నివేదించడం జరిగినది. అమ్మవారిని తేట గీతికలలో అయ్య వారిని ఆటవెలదులలోను తెలుగు మాటలతోను, సూటి భావాలతోను, భక్తిపూర్వకముగ ఆవిష్కృతము చేసినందుకు నా జీవితము ధన్యమైనదని భావిస్తున్నాను.

శరన్నవరాత్రులందు ప్రతి దినము గుడికి వెళ్ళి ప్రదక్షిణలు చేసి వ్రాయడానికి శ్రీకారం చుట్టినందువలన కాబోలు, త్వరలోనే అనుకున్న దానికంటే ముందుగానే శతకములు పూర్తియయినవి. ఈ శతక పద్యములను శ్రీ కంచి కామకోటి పీఠాధిపతి పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి వారు స్పృశించి నన్నాశీర్వదించడం వలన నా జీవితం ధన్యత చెందిందనడంలో సందేహం లేదు.

సాలెపురుగు, హస్తి, సర్పములను గూర్చి పద్యములలో నుంచడమే గాక, శ్రీకాళహస్తి లో చాల సంవత్సరాలున్నందున శివరాత్రి సమయాలలో జరుగు లింగోద్భవం, దంపతులు మేళతాళాలతో కొండ చుట్టి రావడం, ఈశ్వరుని కళ్యాణోత్సవ సమయంలో అనేకమంది బారులు దీరి పెళ్ళిళ్ళు చేసుకోవడం, ముఖ్యంగా అమ్మవారు పుట్టినిల్లయిన "ఊరందూరు"కు వెళ్ళి రావడం, శ్రీ కాళహస్తీశ్వరునికి ఎదురుగా నున్న దుర్గమ్మ కొండ, కుమారస్వామి తిప్ప మొదలగు విషయములను పొందుపరచడం జరిగింది.

నా తల్లిదండ్రులను భక్తి భావంతో --

"తలచి మదిని భక్తి తలిదండ్రుల గొల్చి
శతక పద్యములను శంభు గూర్చి
వ్రాయబూనినాను వరద రక్షింపవే
కాళహస్తివాస ! కావుమీశ !"

అని ప్రార్థిస్తూ శతకములను పూర్తిచేయుటకు సాయపడి ఆశీర్వదించమని తల్లి దండ్రులను వేడు కోవడం జరిగినది.

ఎడతెరిపి లేని కార్యభారంతో సతమత మవుతున్నప్పటికీ నా కోరికను మన్నించి ఆముఖము నందించిన ద్విశతావధాన కర్త, రాష్ట్ర అధికార భాషా సంఘాధ్యక్షులు శ్రీశ్రీశ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారికి సదా కృతజ్ఞురాలిని.

ఈ నా ప్రయత్నానికి మున్ముందు ప్రోత్సాహమిచ్చిన పుత్ర తుల్యుడు, ఉత్తమ పౌరాణికుడు, 'ప్రత్యక్ష దైవం' గ్రంధకర్త అయిన శ్రీ పణతుల రామేశ్వర శర్మకు నా హృదయపూర్వక ఆశీర్వచనములు.

నేను అడిగిన వెంటనే నాయందు గౌరవ భావంతో తమ అభిప్రాయ వేదికలనిచ్చిన "భారత్ భాషా భూషణ్" డా॥ ఆచార్య తిరుమల గారికి, సాహిత్య అకాడమి, ఢిల్లీ మరియు ప్రాంతీయ ఫిలిమ్ సెన్సారు బోర్డు సభ్యులు, "కళా ప్రపూర్ణ " డా॥ పోతుకూచి సాంబశివరావు గారికి కృతజ్ఞురాలిని.

నా ఈ రెండు శతకములను చదివి నన్నాశీర్వదించిన పండితులు కీ.శే. పంచాగ్నుల రమణయ్య గారికి నా కృతజ్ఞతలు.

ఈ శతక ప్రచురణకు ప్రేరణగావించిన కుమారి గౌరీ నాగేశ్వరికి కృతజ్ఞురాలిని.

కవయిత్రి, రచయిత్రి, రీజనల్ ఫిలిం సెన్సార్ బోర్డు మెంబరయిన శ్రీమతి వాసా ప్రభావతి గారికి, వేదవేదాంగాలను క్షుణ్ణంగా నెటిగిన శ్రీమతి చివుకుల లలితా శాస్త్రి, అడ్వకేట్, చీఫ్ అడ్వైజర్ ఫర్ రాజ్యలక్ష్మి పౌండేషన్ చారిటబుల్ ట్రస్టు గారికి, తమ అమూల్యమైన ముందుమాటలిచ్చిన వీరిద్దరికీ సదా సర్వదా నా కృతజ్ఞతలు.

ఈ శతక ముద్రణకై సహకారమందించి, చక్కగా గ్రాఫిక్ వర్కు చేసిన కె. ఆనందరావుగారికి నా కృతజ్ఞతలు.

శతక పద్యములను వ్రాసి నా సంతానాన్ని సదా కాపాడుతుండమని ఆ ఆది దంపతులను వేడుకొనుచున్నాను.

"తనయ, తనయుని, తమ్ముని దయను దలచి
మనుమలను బ్రోవు కోడలి మనుమరాండ్ర
ముదిమనుమరాండ్ర గాచుచు ముదిమనుమల
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !"

___మల్లాది పద్మావతి

# శ్రీకాళహస్తీశ్వర శతకము



కవయిత్రి :

శ్రీమతి మల్లాది పద్మావతి

# శ్రీకాళహస్తీశ్వర శతకము

శ్రీ గిరీశ! నిన్ను సేవించి పూజించి
కలము చేత బట్టి దలచినాను
భవుడ నాకు వేగ భాషనందింపుమా!
కాళహస్తివాస! కావుమీశ! 1

బొజ్జగణపతయ్య! బ్రోవుము నను సదా!
విఘ్న నాశ దేవ! విశ్వరూప!
శతకపద్యములను శ్రమలేక పూరింప!
కాళహస్తివాస! కావుమీశ! 2

శక్తిహీన నబల సామర్థ్యములు లేవు
పద్దెములను వ్రాయ బుద్ధి గొంటి
భావజాలమిచ్చి భవహారం బొనరించి
కాళహస్తివాస! కావుమీశ! 3

పదము లల్లి నీదు పదపద్మముల పొంత
చేర్ప దలచినాను నేర్పుతోడ
అండనుండి సామి అక్షరంబులనిచ్చి
కాళహస్తివాస! కావుమీశ! 4

నన్ను గన్న తండ్రి నాయందు నీవుండి
యాటవెలదు లల్ల నాజ్ఞ నొసగ
నాది మిమ్ము దలచి యఘదూర నగుదును
కాళహస్తివాస! కావుమీశ! 5

పశుపతీశ! యీశ! పన్నగ హారుండ!
శతక పద్యములను సరస మతిని
నుతిని జేయుదాన శితి కంఠ కాపాడు
6 కాళహస్తివాస! కావుమీశ!

పరిమితంబులయిన పదజాలముల చేత
నపరమితుని నిన్ను నరయ గలనె
తగిన పదములిచ్చి తరియింప జేయుమ!
7 కాళహస్తివాస! కావుమీశ!

అంబ నాదు జిహ్వా కక్షరంబు లొసంగు
పద్మభవుని సతియు పదము లిచ్చు
ఓం నమః శివాయ! యుక్తుల నిచ్చును
8 కాళహస్తివాస! కావుమీశ!

శాస్త్ర పరిచయంబు చాలినంతగ లేదు
గ్రాంధికంపు భాష కలుగదింత
నాత్మ యున్నదొకటె యర్పణ జేయను
9 కాళహస్తివాస! కావుమీశ!

తలచి మదిని భక్తి తల్లిదండ్రుల గొల్చి
శతక పద్యములను శంభు గూర్చి
వ్రాయబూనినాను వరద! రక్షింపవే!
10 కాళహస్తివాస! కావుమీశ!

దివ్యలింగపురము దేదీప్యమానంబు
కలుష మడచు మోక్ష కారణంబు
కాళహస్తి పురము కైలాసమే గదా!
11 కాళహస్తివాస! కావుమీశ!

మేన కప్పు వెలది మేటి రుద్రాక్షలు
గంగ నెత్తిమీద రంగు మీర
కొండ కాపురంబు కొప్పున చంద్రుండు
18 కాళహస్తివాస ! కావుమీశ !

ఫాలలోచనుండు ! పన్నగ హారుండు !
నీశ్వరుండు ! పార్వతీశ్వరుండు !
లయము జేయునట్టి భయహారి ! నీవేను !
19 కాళహస్తివాస ! కావుమీశ !

ఎఱుక వానికేమి యెఱుక యన్నది కన్న
మనసు నిలిపి నిన్ను మదిని దలప
పరమ సుఖములిచ్చు పరమేశ్వరుండవు
20 కాళహస్తివాస ! కావుమీశ !

పూర్వజన్మ ఫలము పొందుదు రందఱు
కర్మ ఫలము నెపుడు కలిగి యుంద్రు
నీవు చూచితేని నిలువదే కష్టంబు
21 కాళహస్తివాస ! కావుమీశ !

మనసునందున గల మలినంబు దొలగించి
మంచి మార్గములను మాకు జూపి
సద్గుణంబు లొసగి సాకవే మాతండ్రి
22 కాళహస్తివాస ! కావుమీశ !

కామ దహన ! నన్ను కరుణించి బ్రోవుము
చంద్రమౌళి చూడు చల్లగాను
కనక శైల చాప ! కాపాడు మేనాడు
23 కాళహస్తివాస ! కావుమీశ !

నేను నేన నియెడి నీచ భావంబును
పారద్రోలుమయ్యి పార్వతీశ!
యిహాము దూరముంచి యిహ పరంబొసగుమా!
కాళహస్తివాస! కావుమీశ! 24

ఎన్ని జన్మ లెత్త నీ జన్మ కలిగెనో
జన్మ సార్థకముగ జరుపు మయ్యా
జన్మ జన్మములను సన్మార్గమున గొల్తు
కాళహస్తివాస! కావుమీశ! 25

చిత్తమందు నిన్ను సేవింప దలచిన
పరుగులెత్తుచుండు పాడు మనసు
మనసు కుదురునట్టి మార్గంబు దెలుపవే
కాళహస్తివాస! కావుమీశ! 26

వేద శాస్త్రములను వెలయుంగ జదివిన
పండితుండునైన పట్టు లేదు
భక్తి లేక నిన్ను పట్టంగ నేర్తురే?
కాళహస్తివాస! కావుమీశ! 27

కనులు మూయ నీవు కనుపించుటయు లేదు
ధ్యానమందు నెట్టి ధ్యాస లేదు
యెట్టులయ్యా నిన్ను పట్టంగ నేర్తును?
కాళహస్తివాస! కావుమీశ! 28

పరమ పురుష! నన్ను పాలింప మంటిని
వామ దేవ! నాకు వరములొసగు
సత్యమూర్తి! నాకు సన్మతి నిడుమయ్యా
కాళహస్తివాస! కావుమీశ! 29

తలచు భక్త జనుల తలపుల దీర్చెడి
భోళ శంకరయ్య ! భూతనాథ !
నన్ను బ్రోవకిట్లు మిన్న కుండెద వేల ?
30 కాళహస్తివాస ! కావుమీశ !

క్షణములోన నేమి జరుగంగ నున్నదో
యెఱుగ వశమె ధరణి నేరికైన ?
నింతమాత్రముననె యిది నాది యందురు
31 కాళహస్తివాస ! కావుమీశ !

పాంచ భౌతికంబు భావింప కాయంబు
శాశ్వతంబు కాదు సారమిదియె
శాశ్వతంబు నీదు చరణాబ్జముల సేవ
32 కాళహస్తివాస ! కావుమీశ !

మంచివాడు నిలను మన్నన బొందును
గుణము మిన్న చూపె కులము కాదు
సత్ప్రవర్తనంబు సత్ఫల మిడుచుండు
33 కాళహస్తివాస ! కావుమీశ !

భూత భావనాయ ! భూతేశలింగాయ !
పావనాయ ! త్రిపుర భంజనాయ !
నిగమ గోచరాయ ! నీకిదే దండంబు
34 కాళహస్తివాస ! కావుమీశ !

లింగరూప నిన్ను లింగోద్భవము నందు
వేల జనులు జేరి వేడుకొనుచు
భక్తి భావమలర భజియించు చుందురు
35 కాళహస్తివాస ! కావుమీశ !

మూగజీవులకును ముదము భక్తినొసంగి
మోక్షమిచ్చినట్టి ముక్తిదాత!
మోక్షమొసగుకొఱకు మ్రొక్కుచుంటిని నేను
కాళహస్తివాస! కావుమీశ! 36

గంగ మౌళి దాల్చు గజచర్మధారుడా!
భూతిరేఖ యుక్త! పూత చరిత!
సాధురక్ష! నన్ను సరగున కాపాడు
కాళహస్తివాస! కావుమీశ! 37

కోరివచ్చి నిన్ను కోరిక లిమ్మన్న
కొంగు బంగరమ్ము కొరత గలదె!
కోరినాను నరక కూపమ్ము దొలగింపు
కాళహస్తివాస! కావుమీశ! 38

నిన్ను గొలచి కొలచి నీరసించితి నయ్యా
యంబ పదము బట్టి యలసిపోతి
ముక్తి నీయ వేమి మోక్షదాయక ప్రభూ?
కాళహస్తివాస! కావుమీశ! 39

మేళతాళములతొ మేలైన రాగాల
పాడి కొలుత మనిన పాట రాదు
చిత్త శుద్ధితోడ సేవింతు కాపాడు
కాళహస్తివాస! కావుమీశ! 40

అల్పజీవి బ్రోచు నకలంకమగు కీర్తి
నీకు దక్కెనయ్యా నీల కంఠ!
నన్ను బ్రోతు వనుచు నమ్మినే వచ్చితి
కాళహస్తివాస! కావుమీశ! 41

పుట్టినట్టి వారు గిట్టుట తథ్యంబు
పుట్టి గిట్టి మరల పుట్టుటెల్ల
నెట్టి వారికైన గట్టి సత్యంబిది
42 కాళహస్తివాస ! కావుమీశ !

ఘన చరిత్ర ! నీదు కళ్యాణ సమయాన
తండములుగ జనులు దాము కూడ
పెండ్లి యాడి మిగుల ప్రియమున నుబ్బరే!
43 కాళహస్తివాస ! కావుమీశ !

పాదపద్మములను పట్టిన వారికి
నభయ హస్తమిచ్చి యట్టె ప్రోచు
నఖిల లోక నేత వాది దేవుండవు
44 కాళహస్తివాస ! కావుమీశ !

ఆదిదేవ ! నన్ను నాదరింపుము సామి
సామ వేద రూప ! సాధు వరద !
వాయులింగ రూప ! వరదాభయ ప్రదా !
45 కాళహస్తివాస ! కావుమీశ !

నామ మంత్ర మొకటి నాలుక యందుండ
వేగ బ్రోచు వేదవేద్యుడీవు
కొంగు బంగరమ్ము కోర్కెలీవిత్తువు
46 కాళహస్తివాస ! కావుమీశ !

శివుని యాజ్ఞలేక చీమైన కుట్టదు
అనెడి నానుడి నిల వినగ లేదె ?
నీదు దయను బొంద నిర్విఘ్నమగుచుండు
47 కాళహస్తివాస ! కావుమీశ !

కన్నబిడ్డ రీతి కాచుచుంటివి సామి
యెన్నలేను మేలు సన్నుతాంగ
దర్శనంబు నిచ్చి ధన్యను జేయవే !
కాళహస్తివాస ! కావుమీశ ! 48

పనికిరాని మాట పదిమందితో కూడి
వాదులాడుచుంటి వామ దేవ !
తెలియలేదు నీదు తిరు మంత్ర నామంబు
కాళహస్తివాస ! కావుమీశ ! 49

అండ నుండ శివుడు దండ నాథుని బాధ
పట్టబోవదెట్టి పాపికయిన
నీవ దిక్కువగుము నిత్యంబు వేడెద
కాళహస్తివాస ! కావుమీశ ! 50

అనఘ విప్ర సూను డంతకు భీతిచే
శరణు శరణ మనిన క్షణములోనె
కదలి వచ్చి నీవు కరుణ రక్షింపవే
కాళహస్తివాస ! కావుమీశ ! 51

మంత్ర జపము జేయు మతిని జేకూర్చుము
నీదు గుణము బొగడు నేర్పు నిమ్ము
నీదు నామ జపము నీమమ్ముతో జేతు
కాళహస్తివాస ! కావుమీశ ! 52

ఫాలభాగమందు భాసిల్లు నా భూతి
మేన గజము తోలు మెడను నాగు
చూడ ముచ్చటగును జోగి దేవర నిన్ను
కాళహస్తివాస ! కావుమీశ ! 53

తుమ్మి పూల దెచ్చి తొలుత నీపయినిడి
బిల్వదళములన్ని ప్రీతి నునచి
పూజ చేతునయ్య రాజితాచల వాస !
54 కాళహస్తివాస ! కావుమీశ !

ఏమి నోము నోచె నింతి పార్వతి దేవి
యర్థభాగమందె నమరి యుండె
సర్వమంగళములు సంప్రీత య్యైనిడు
55 కాళహస్తివాస ! కావుమీశ !

ఏ భవుండు జగము నేలుచుండు నెపుండు
నయము తోడ జగము లయము జేయు
నట్టి వాని నిన్ను నాశ్రయింతు గదయ్య
56 కాళహస్తివాస ! కావుమీశ !

పరమ భక్తి నిన్ను పార్థుడు ప్రార్థింప
బాశుపతము నిచ్చి బలము నిచ్చి
వీరవరుల యందు విజయుని చేయవె !
57 కాళహస్తివాస ! కావుమీశ !

నిన్ను నేను దెలసి కొన్నను చాలదా
చిన్న మాట రాక చింత తోను
నలు కెలంకు లరిగి నగుబాట్లు పడకుండ
58 కాళహస్తివాస ! కావుమీశ !

జాగరణలు సేయ జటధారి శివరాత్రి
ముక్తి నొసగుచుందు ముక్తిదాత
లోక హితము జేయు లోకనాథుడ వీవె !
59 కాళహస్తివాస ! కావుమీశ !

భూత నాథ ! శంభు ! భూతభావన దేవ !
విశ్వనాథ ! శర్వ ! విశ్వరూప !
నంది వాహనుండ ! నన్ను గావుము దేవ !
కాళహస్తివాస ! కావుమీశ ! 60

ఫాలనేత్ర ! శంభు ! ఫణిహార ! సర్వేశ !
వరద ! నిన్ను దలతు వరములీయ
గరళ కంఠు నాద్యు శరణంబు వేడెద
కాళహస్తివాస ! కావుమీశ ! 61

కనని వినని వన్ని కాదన కగుచుండు
వినిన కనిన వెన్నొ వీగిపోవు
నీవు దలచునంత నిఖిలంబు శుభమౌను
కాళహస్తివాస ! కావుమీశ ! 62

నీదు లీలలెన్నొ నిండె నీ జగమెల్ల
నందనారు నెఱుగు వందనీయ
యెరిగినారు మునులు నెల్లరు భక్తులు
కాళహస్తివాస ! కావుమీశ ! 63

జన్మ సార్థకంబు జంబుకేశ్వరు గొల్వ
పాపపంకిలంబు బాసిపోవు
పుణ్యలోకములను పొందుదు రందఱు
కాళహస్తివాస ! కావుమీశ ! 64

కాలకూట విషము కంఠంబు నందుంచి
గరళ కంఠుడయితి గిరివరేణ్యా !
పరుల మేలుజేయ పాటుపడెడి దేవ !
కాళహస్తివాస ! కావుమీశ ! 65

చేరి తాళ్ల నల్ల చెలదిని సేగాను
పడగ విప్పి పట్టు ఫణిని గాను
భక్తి భావములను భజియించెదను గాక
66 కాళహస్తివాస ! కావుమీశ !

కొండ చుట్టు తిరిగి కోరిక లిమ్మంచు
మెండుగాను భక్త దండు రాగ
నండనుండి మాకు అభయ హస్తంబీవె
67 కాళహస్తివాస ! కావుమీశ !

సాలెపురుగు మదిని సర్వంబు విడనాడి
భక్తి తోడ నీదు పదము బట్టి
యట్టె ముక్తినొంది యైక్యమైపోవదా !
68 కాళహస్తివాస ! కావుమీశ !

ఇసుక లింగ రూప మేపార నొకచోట
వాయు లింగ మొకట వరములీయ
వివిధ రూపములను వెలుగొందు చుందువు
69 కాళహస్తివాస ! కావుమీశ !

జన్మనెత్తి నట్టి జనులెల్ల సేవింప
జన్మ సార్థకమును సలుపు తండ్రి
జన్మ రహిత మిచ్చు సన్మార్గమును దెల్పు
70 కాళహస్తివాస ! కావుమీశ !

పిలుపు వినగరాదు పలుకులు మునె లేవు
పంత మేల నయ్యా చింత దీర్ప ?
మంతనాలు మాని మఱువక ప్రోవుమా !
71 కాళహస్తివాస ! కావుమీశ !

విన్నపములు నావి వీనులందుంచుకో
శరణు వేడినాను పురహరుండ !
కామితార్థ వరద ! కరుణ చూడుము ప్రభో!
కాళహస్తివాస ! కావుమీశ ! 72

కావు కావు మనుచు కరయుగంబులు మోడ్చి
చేర వచ్చినాను సేతు ధామ !
చెంత జేరువారి చింత దీర్తు వటంచు
కాళహస్తివాస ! కావుమీశ ! 73

పాదపద్మములను పట్టి నే విడువక
ప్రాకులాడు చుంటి పార్వతీశ !
మోక్ష సిద్ధి కొఱకు ముక్కంటి ! వేడితి
కాళహస్తివాస ! కావుమీశ ! 74

గిరులు దరులు వెదకి దరి గానగా లేక
విసిగి వేసరిల్లి విమల చరిత !
కడకు నిన్ను గొల్వ గడగితి నీనాడు
కాళహస్తివాస ! కావుమీశ ! 75

చింత దీర్చు సామి చెంత నున్నాడని
గంపెడాశ తోటి గడుపుచుంటి
పంత మేలనయ్య భక్తుల రక్షింప
కాళహస్తివాస ! కావుమీశ ! 76

జడున కేమి దెలియు జపమాల చేబట్టి
నాస్తికుం డెరుగునె నామ జపము
మూర్ఖు కేమి దెలియు ముక్కంటి మహిమలు
కాళహస్తివాస ! కావుమీశ ! 77

మును గజాసురుండు జనముల హింసింప
మునులు దేవవరులు మొఱలు పెట్ట
నట్టె ద్రుంచి వారి నానంద పరచవే!
78 కాళహస్తివాస! కావుమీశ!

విశ్వనాథ! నన్ను వెతల బెట్టకుమయ్యా
వేయి కనుల జూడు విమల చరిత!
దయను జూడ గౌరి దరిజేరినా నయ్యా
79 కాళహస్తివాస! కావుమీశ!

జ్ఞానమొసగునట్టి జ్ఞానాంబ నీచెంత
చేరి సకల జనుల చింత దీర్చు
తల్లి దండ్రులనుచు దలతు నా చిత్తాన
80 కాళహస్తివాస! కావుమీశ!

హరికి శతకమిచ్చి యానంద మందితి
హరియు హరుడు వేరె యని తలంచి
యిర్వు రొక్కరనుచు నీనాడెఱింగితి
81 కాళహస్తివాస! కావుమీశ!

పట్టుదలయు గల్గి పని చేయుచుండిన
నపజయంబు దూరమగుచు నుండు
భవుని దలచి గంగ భువి దెచ్చె నొక రాజు
82 కాళహస్తివాస! కావుమీశ!

దుర్లభుండ వంద్రు దొరకవెవ్వారికి
భక్తి తోడ నిన్ను పట్ట నగును
దోసిలొగ్గు వారు దొరికించు కొందురు
83 కాళహస్తివాస! కావుమీశ!

మనుజ జన్మ నిచ్చి మసలుటయును దెల్పి
మంచి చెడులు రెండు నెంచి చూపి
మూఢులైన నేమి ముక్కంటి బ్రోతువు
కాళహస్తివాస ! కావుమీశ ! 84

మంత్ర మూర్తి ! మాత మణి కర్ణికాదేవి
చెంత నుండి నీకు చేయు ముదము
నంతరంగ మందు నటువంటి నిను గొల్తు
కాళహస్తివాస ! కావుమీశ ! 85

నటనసూత్రధారి ! నటరాజ శేఖరా !
వృషభ వాహనుండ ! విష్ణు మిత్ర !
మేరు ధన్వి ! నాకు మేలొన రించుమా !
కాళహస్తివాస ! కావుమీశ ! 86

అస్థి పంజరమును అనువగు కండల
మాంసపిండములను మనుజు చేసి
ప్రాణ మిచ్చి యిలను ప్రాకులాడుట కేన ?
కాళహస్తివాస ! కావుమీశ ! 87

నీడ రీతి నేను నీదరి జేరితి
విషపు పంకిలంబు వెడల జేసి
యాదరింపుమయ్య ! యరమర లేకుండ
కాళహస్తివాస ! కావుమీశ ! 88

మహిత కీర్తి దెచ్చె మహిషాసురుని జంపి
యాది శక్తి దుర్గ యఖిల జనని
రౌద్ర రూప నెట్లు రంజింప జేసితో ?
కాళహస్తివాస ! కావుమీశ ! 89

కాశికా నివాస ! కాత్యాయినీ పతి !
మధుర పురనివాస ! మమత జూపి
కావుమయ్య నన్ను ! కాళహస్తీశ్వర !
90 కాళహస్తివాస ! కావుమీశ !

నిన్ను జూడకుండ నేనుండ జాలను
కాన రాదు గౌరి కనుల జూడ
దర్శనంబు నిచ్చి దారి జూపింపుమా
91 కాళహస్తివాస ! కావుమీశ !

విఘ్నరాజ జనక ! విడువక కాపాడు
పార్వతీశ ! చూడు పదిలముగను
స్కంధ జనక నన్ను సతతంబు గాపాడు
92 కాళహస్తివాస ! కావుమీశ !

పంచ భక్ష్యములను పాయసాన్నంబుల
మంచి పిండి వంట మేటి పండ్లు
నారగింపగ నివిగో నాలసించెద వేల ?
93 కాళహస్తివాస ! కావుమీశ !

తన్ను తాను తెలిసి తత్వజ్ఞు డగునట్టి
ఘనుడు నంతకంటె ఘనత గలదె ?
తన్ను తానెరిగెడి తత్వంబు నీగదె !
94 కాళహస్తివాస ! కావుమీశ !

కాలమెంతో వడిగ కదలి పోవుచుండు
వార్ధకంబు వచ్చు వయసు హెచ్చి
ప్రాయముండునాడె పరమేశు గొల్వుడీ !
95 కాళహస్తివాస ! కావుమీశ !

మేరు ధామ వాస ! మేనకా తనుజేశ !
నిగమ గోచరుండ ! నిత్య రూప !
శరణు వేడినాను సర్వేశ ! కాపాడు
కాళహస్తివాస ! కావుమీశ ! 96

ఆదిశక్తినీకు నాహ్లాదమున గొల్తు
భవుని దలతు మదిని భక్తి తోడ
పాప పంకిలంబు పారంగ ద్రోయవే !
కాళహస్తివాస ! కావుమీశ ! 97

వాయులింగమూర్తి ! వరముల నీయవే !
యఘము పారద్రోలు మాది దేవ !
దయను జూపు తల్లి ! దాక్షాయణీ దేవి !
కాళహస్తివాస ! కావుమీశ ! 98

దుర్గ కొండ మీద దుర్గాంబ యుండెను
కుమర సామి తిప్ప కొమరు డుండె
సతిని సుతుని జూచి సంతోష మందవే ?
కాళహస్తివాస ! కావుమీశ ! 99

శాశ్వతంబగునె యశాశ్వతంబగు మేను
తిరమటంచు నేను తిరిగినాను
నాకు మోక్షమార్గ మంత్రంబు దెల్పవే !
కాళహస్తివాస ! కావుమీశ ! 100

మనసునందు నిన్ను మరువక సేవింతు
పూజ చేయుచుందు పుణ్యమూర్తి
జాగు చేయకుండ జాహ్నవీపతి బ్రోవు !
కాళహస్తివాస ! కావుమీశ ! 101

పట్టుపడ వదెట్టి పరమ యోగులకైన
ఎఱుక వాని కెట్లు దొరికి తీవు ?
పట్టుకొనుట నిన్ను "పద్మావతి"కి నౌనె ?
102 కాళహస్తివాస ! కావుమీశ !



ముట్టుకొనగ రాని, ముక్కంటి, నిను తాన
దెట్లు పూజ చేసె నెఱుక రాజు ?
కన్నబిడ్డ రీతి కన్నప్ప జూడవే ?
103 కాళహస్తివాస ! కావుమీశ !

అన్ని నావెయంచు నాహ్లాదమును బొంది
ప్రాకులాడుచుంటి భావమందు
'విశ్వమీవ' యనెడి విజ్ఞాన మొసగుమా !
కాళహస్తివాస ! కావుమీశ ! 104

పంచదార తీపి పాలమీగడ రుచి
తేనె కంటె వేరు తీపి గలదె ?
వాని కంటె తీపి వరద నీ నామంబు
కాళహస్తివాస ! కావుమీశ ! 105

ఫాలలోచనుండు పన్నగ హారుండు
ప్రమదనాథు డతడు పరమ యోగి
భక్తవరదు డెపుడు పాలించు గావుత
కాళహస్తివాస ! కావుమీశ ! 106

ప్రమదగణము లెల్ల పాలించి బ్రోవవే ?
పరమ పురుష నీదు భక్తి నిమ్ము
ఆర్త రక్షకుండ ! యనిశంబు కాపాడు
కాళహస్తివాస ! కావుమీశ ! 107

మంగళంబు నీకు మాత ప్రసూనకు
మంగళంబు లివిగో మాన్య చరిత !
మంగళంబు గొనుచు మమ్ము రక్షింపుమా !
కాళహస్తివాస ! కావుమీశ ! 108

# జ్ఞాన ప్రసూనాంబ శతకము



కవయిత్రి :

శ్రీమతి మల్లాది పద్మావతి

# జ్ఞాన ప్రసూనాంబ శతకము

శ్రీకరంబుగ శుభములు చేరి నిడెడి
యంబ ! జగదంబ ! నిను మది నట్టె నునచి
వ్రాయ బూనితి శతకంబు వందనీయ
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 1

పదములన్నిటి సమకూర్చి ప్రస్తుతింప
శతక పద్యమ్ములను వ్రాసి నుతి నొనర్తు
నందుకొని మమ్ము కాపాడు మమల చరిత !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 2

పరమ పావని ! శాంభవి ! పంకజాక్షి !
తేటగీతల కీర్తింతు తేటపరచి
కరుణ నిలువుము నా మ్రోల కాదునాక
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 3

పదము లందల్ల కూర్పులు పాటవముగ
భావ రచనలు బహురీతి పలుకనేర్చు
ప్రజ్ఞయును లేదు నాకమ్మ పద్మవల్లి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 4

సకల శాస్త్రంబులందును సాటిలేని
తండ్రి నరసింహ శాస్త్రిని దలచి మదిని
దీవెనల బొంది నల్లుదు తేటగీతి
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 5

అమ్మ! సంజీవి! సతతము నండనుండి
శతకమును పూర్తి చేయగ సాయపడగ
శ్రద్ధజూపుచు దీవించు శాంతమూర్తి!
6 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

పాదపద్మాల బట్టితి పంకజాక్షి!
నన్ను కాపాడు లలితమ్మ! నాదు తల్లి!
కల్ల సేయకు నా యాశ కలువకంటి!
7 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

మధుర మీనాక్షి! కాపాడు మాత నన్ను
కంచి కామాక్షి! కాపాడు కన్న తల్లి!
కాశికా రాజ్ఞి! మమ్ముల కావుమమ్మ!
8 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

అభయ హస్తమ్ము జూపి నీ వఖిల జనుల
గాచు జగదాంబ నీకన్న గలదె జగతి?
నెంచి నీ చెంత జేరితి నేలు మమ్మ!
9 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

పరమ పావని! దుర్గమ్మ! ప్రస్తుతింతు
సర్వమంగళ! శాంభవి! సన్నుతింతు
మదనహారుని సతి! నిన్ను మదిని దలతు
10 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

చింత దీర్పుము నా తల్లి సింహమధ్య!
యెంతగా నిను వేడితి నేల జాగు?
పంత మేలను జేసెదు పాడి యగునె?
11 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి!

అంబ ! శాంభవి ! కళ్యాణి ! యఖిల జనని !
యభయ మిడుదువు భక్తుల కవని యందు
యాదరింపుము నన్నెప్పు డాది శక్తి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 12

దుర్గ ! శ్రీలక్ష్మి ! దురితంబు తొలగ ద్రోసి
సర్వమంగళ ! సతతము సౌఖ్య మొసగి
చారుహాసిని ! జూడుము చల్లగాను
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 13

సద్గతి నొసంగు సద్గుణ ! సత్వరూపి !
బాల ! భార్గవి ! భైరవి ! భక్తవరద !
కరుణ జూడుము శాంభవి ! కంబుకంఠి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 14

వత్సరంబున కొకసారి యుత్సవమున
పుట్టినిల్లు "నురందూరు" పోయి రావె
మఱతురే పుట్టినింటిని మగువ లనగ
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 15

భక్తి పాలాభిషేకంబు పసుపు దిద్ది
పసిడి పుట్టము గట్టి యాభరణములను
సన్నుతంబగు నీ రూపు నెన్న తరమె ?
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 16

నిత్య కళ్యాణి ! శర్వాణి ! నిగమరూప !
ఖరహరప్రియ ! కేదార ! కలువకంఠి !
తోడి హంసధ్వనులు మెచ్చు తోయజాక్షి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 17

వాణి ! వరలక్ష్మి ! గిరిపుత్రి ! వాగ్విలాస!
ముగ్గురంబల మూర్తివి మోక్షదాయి !
శక్తి రూపివి నీవంచు భక్తి గొలుతు
18 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పశుపతీశుని ప్రీతిని బడయ గౌరి
తపము జేసితి వమ్మరో తరళనేత్ర !
పూజ ఫలియించి పొందితి భూతనాథు
19 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ఆత్మ విద్యా స్వరూపిణి ! యాదిశక్తి !
శబ్దరూపిణి ! యోంకార సార రూప !
ప్రణవ నాదిని ! బహురూప ! పద్మనయన!
20 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

సింహమధ్యమ ! చిద్రూపి ! శ్రీలతాంగి !
రాజరాజేశ్వరీ ! దేవరాజ వినుత !
ప్రాణరూపిణి ! భగవతి ! ప్రాణదాయి !
21 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

కాళి ! కౌమారి ! కుముదిని ! కలశహస్త !
సాక్షివర్జిత ! సర్వాత్మ ! సాధుపూజ్య !
మూల ప్రకృతి వీవేగ మోక్షదాత్రి !
22 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

నమ్మి యుండిన నేరికి నాశనంబు
నుండబోదమ్మ ; నిను నమ్మియున్నవారి
యండ జేరితి కాపాడు మఖిల జనని !
23 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

వినయ విస్మయ సద్భావ వీచికలను
భక్తి సమృద్ధి సమరస భావములను
తల్లి నిను జేర వచ్చితి నుల్ల మలర
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 24

నీదు దర్శన భాగ్యమ్ము నేరనమ్మ ?
నాకు దర్శన మీగదే లోకజనని !
పంతములు మాని రావమ్మ పార్వతమ్మ !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 25

చీకుచింతలు లేకుండ శివుని దలచి
నిన్ను గొలువను వచ్చితి నీరజాక్షి !
తునుపగద వమ్మ నాయొక్క దురితములను
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 26

అన్యభావము లేక నిన్నాత్మ గొల్చి
పతికి నాయువు తెచ్చి తా బడసె సుఖము
మురిసి ముత్తైదువుగ నిల్చెమున్ను కన్య
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 27

అమ్మ ! పెద్దమ్మ ! మూలపుటమ్మటంచు
కోరుకొన్నట్టి పతిబొందె కొలిచి నిన్ను
నట్టి రుక్మిణి భాగ్యంబు నగునె బొగడ ?
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 28

బాల ! గాయత్రి ! దుర్గమ్మ ! భారతనగ
నవ విధంబుల రూపులు నవని బూని
మించి జగముల రక్షించు మీననేత్ర !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 29

పుణ్యరూపిణి ! పావని ! పూతచరిత !
పుణ్యకాంతా ప్రపూజిత పుణ్యరాశి !
పుణ్యదాయని పరిపూర్ణ పుణ్యలభ్య !
30 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ధ్యానమందును, ధనమందు, ధామమందు
భూమియందు నధోభాగ భూమియందు
సర్వజగతిని నిండిన సర్వసాక్షి !
31 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పూజ చేసిన నిత్తువు పుణ్య మమ్మ !
ప్రస్తుతించిన నిత్తువు పరమ పదవి
దృష్టి నుంచిన నిత్తువు పుష్టి తుష్టి
32 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

రాగతాళాల చేకొని రమ్యగతుల
భేరిబాజాల మ్రోతల చేరి కొలువ
శృతిలయంబులు సేరను నుతి నొనర్ప
33 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

రామచంద్రుడు పూజించె రమణి తోడ
నెందరెందరో భక్తుల నేలితమ్మ
దీన నన్నేలు కరుణతో దేవదేవి !
34 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

మొగలిరేకులు మరువంపు ముక్కలునచి
మల్లెపూవులు మందార మాలలల్లి
మెడను వేసెద నమ్మ నీ మేను వెలుగ
35 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పాలమీగడ మరి మంచి ఫలములెన్నో
భక్తి మీరగ చేసిన భక్ష్యములను
నతిరసంబుల నుంచితి నారగింపు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 36

అభవు పట్టంపు రాణివి యాది శక్తి !
మధురమంజుల భాషిణి ! మాన్యచరిత !
మాకు శుభముల నీయుము మహితరూప !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 37

అన్నమును నీరు లేకుండనైన నీవు
భూరి తపమాచరించి శ్రీభూతనాథు
చేయి పట్టిన రాజ్ఞివి చిత్తగించు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 38

భవుని పెండ్లికి పెద్దలు బ్రహ్మవిష్ణు
నిండు మనమున నీవుండ నీరజాక్షి !
కడిగె శంభుని పదములు గట్టురాజు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 39

అంబ ! జగదాంబ ! దుర్గాంబ ! ఆదిలక్ష్మి !
మాత ! శ్రీమాత ! సద్గుణవ్రాత ! గౌరి !
తల్లి ! పార్వతి ! నిను సదా తలచుచుంటి
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 40

సర్వమంగళముల నిచ్చు సాధు వరద !
ముదము మీరగ గొలిచిరి మునులు సురులు
సద్గతిన్ బొంద గొలుతు నిన్ శంభుదేవి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 41

కోటి దేవతలును నిన్ను కూర్మి మీర
పూజలను జేసి కొలిచిరి పూతచరిత !
జనని ! నిను గోరి వచ్చితి ననునయింపు !
42 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ముందు పాతాళ గణపతి ముదముతోడ
మించి సత్కృప జనుల రక్షించుచుండ
దర్శనము జేయు వారలు ధన్యులంట
43 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

మధుర మీనాక్షి వందురు మధుర నుండ
కంచి కామాక్షి వందురు కంచి నుండ
శక్తివయి యుంటి వందురు శంభురాణి !
44 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

నటన జేతువు నటరాజు నాధుజేరి
పదము వేతువు పతిగూడి పాటవముగ
శ్రుతిని గలుపుదు శివునితో స్ఫూర్తి మీర
45 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

త్రిపుర సంహార కారిణి విపుల కీర్తి !
శూల హస్తిని ! శ్రీదేవి ! శుభ్రమూర్తి !
యాదరింపగదమ్మరో ! యాదిశక్తి !
46 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

మధ్యమావతి ! శ్రీరాగ ! మాతవమ్మ !
యంబ ! కన్నడ ! బేగడ ! యఖిల జనని !
నాదనామక్రియారభి ! నాదరూప !
47 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పాలమీగడ మరి మంచి ఫలములెన్నొ
భక్తి మీరగ చేసిన భక్ష్యములను
నతిరసంబుల నుంచితి నారగింపు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 36

అభవు పట్టంపు రాణివి యాది శక్తి !
మధురమంజుల భాషిణి ! మాన్యచరిత !
మాకు శుభముల నీయుము మహితరూప !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 37

అన్నమును నీరు లేకుండనైన నీవు
భూరి తపమాచరించి శ్రీభూతనాథు
చేయి పట్టిన రాజ్ఞివి చిత్తగించు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 38

భవుని పెండ్లికి పెద్దలు బ్రహ్మవిష్ణు
నిండు మనమున నీవుండ నీరజాక్షి !
కడిగె శంభుని పదములు గట్టురాజు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 39

అంబ ! జగదాంబ ! దుర్గాంబ ! ఆదిలక్ష్మి !
మాత ! శ్రీమాత ! సద్గుణవ్రాత ! గౌరి !
తల్లి ! పార్వతి ! నిను సదా తలచుచుంటి
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 40

సర్వమంగళముల నిచ్చు సాధు వరద !
ముదము మీరగ గొలిచిరి మునులు సురులు
సద్గతిన్ బొంద గొలుతు నిన్ శంభుదేవి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 41

కోటి దేవతలును నిన్ను కూర్మి మీర
పూజలను జేసి కొలిచిరి పూతచరిత !
జనని ! నిను గోరి వచ్చితి ననునయింపు !
42 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ముందు పాతాళ గణపతి ముదముతోడ
మించి సత్కృప జనుల రక్షించుచుండ
దర్శనము జేయు వారలు ధన్యులంత
43 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

మధుర మీనాక్షి వందురు మధుర నుండ
కంచి కామాక్షి వందురు కంచి నుండ
శక్తివయి యుంటి వందురు శంభురాణి !
44 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

నటన జేతువు నటరాజు నాధుజేరి
పదము వేతువు పతిగూడి పాటవముగ
శ్రుతిని గలుపుదు శివునితో స్ఫూర్తి మీర
45 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

త్రిపుర సంహార కారిణి విపుల కీర్తి !
శూల హస్తిని ! శ్రీదేవి ! శుభ్రమూర్తి !
యాదరింపగదమ్మరో ! యాదిశక్తి !
46 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

మధ్యమావతి ! శ్రీరాగ ! మాతవమ్మ !
యంబ ! కన్నడ ! బేగడ ! యఖిల జనని !
నాదనామక్రియారభి ! నాదరూప !
47 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ముక్తి దాతలు దంపతుల్ మోక్షమీయ
కొలువ బాధలు లేవెట్టి ఖలున కయిన
వెలసిరీ కాళహస్తిలో పేడ్క మీర
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 48

వెలసినావమ్మ దుర్గాంబ ! వేదవేద్య !
దుర్గ కొండన నీవుండ దోసిలొగ్గు
జనుల రక్షించు తల్లివి సాధువంద్య !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 49

పశుపతీశ్వరుడీశుడు ప్రక్కనుండ
నంకమందున తనయుండు నలరుచుండ
ముదముతోనుండు నిను జూడ ముచ్చటగును
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 50

వాహనంబుల మీద నా వాడవాడ
లరసి తిరుగుచు హారతు లందుకొనవె !
భక్తు లిడుచుండ శివరాత్రి పర్వమందు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 51

నిన్ను నమ్మితి నమ్మరో నీరజాక్షి !
తల్లి సుత జూచు చందాన తరుణి నీవు
నన్ను కాపాడు దుర్గమ్మ ! నాకవంద్య !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 52

మంజుభాషిణి ! బుధసేవ్య ! మాన్యచరిత !
కమలవాసిని ! వరచక్రఖడ్గ హస్త !
శూలధారిణి ! నిను గొల్తు స్ఫూర్తినిమ్మ !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 53

పీత వస్త్రము ధరియించి ప్రీతితోను
పసిడి నగలను ధరియించి పాలుగారు
మోము గనిపించు భక్తులు మురియుచుండ!
54 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

భజన చేసెద నంబను భక్తితోడ
ముక్తి నిమ్మని గొల్చెద శక్తి గొలది
జ్ఞానమును బొంద నిరతమ్ము జపముజేతు
55 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పాదపద్మంబులను గొల్వ పంకజాక్షి !
పూజ చేయగ వచ్చితి పూతచరిత !
పద్మగంధిరో ! గొనుమమ్మ పసిడిబొమ్మ!
56 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

సర్వ వేద స్వరూపిణి శ్యామలాంగి !
సర్వ దేవ స్వరూపిణి సరళ హృదయ !
సర్వ పూజిత నిను గొల్తు సముచితముగ
57 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

నెమలి వాహన మాత నా నేరమేమి ?
విఘ్న దేవుని తల్లి ! నా వినతి వినుము
జాగుచేయక నను బ్రోవు జ్ఞానదాయి !
58 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

కాచి రక్షణ జేయును కమలనేత్ర
భక్త రక్షణ చేయును భవుడు ప్రీతి
నిద్దరుండగ నాకేమి యింక భయము ?
59 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అరిభయంకరి ! శివురాణి ! గిరికుమారి !
భక్తజన మందిరాంగణ పారిజాత !
దీనబాంధవి ! కావుమ దీనురాల !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 60

దివిజనుత ! లక్ష్మినాగ ! వాగ్దేవినాగ !
శైలనందన ! నా మూల శక్తివగుచు
కాచుచుందువు మా పాలి కల్పకంబ !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 61

సింహవాహన ! సావిత్రి ! శక్తిరూప !
భీకరాసుర మర్దినీ ! లోకజనని !
దుష్ట శిక్షణ జేసెడు దుర్గ వీవె !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 62

మేరు పర్వత వాసిని ! ధీర చరిత !
నందిపూజిత ! యోగేంద్ర వందనీయ !
కార్తికేయుని మాతరో ! గౌరిదేవి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 63

తలప నేబదిరెండు క్షేత్రంబు లందు
మించు కారుణ్యమమర రక్షించు కొఱకు
వేదవందిత ! బహురూప ! వెలసినావు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 64

మహిని నీవంటి దేవత మాకు గలదె ?
పతిత పావని ప్రత్యక్ష భవుని సతిరో !
భక్త కామిత దాయని భానుతేజ !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 65

సర్వమంత్ర స్వరూపిణి ! సర్వశక్తి !
సర్వ విశ్వ స్వరూపవు జనని ! నీకు
వాసవార్చిత ! శతకోటి వందనములు
66 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

నాదు పుణ్యము చేతను నమ్మియుందు
నెటుల బ్రోతువో కాతువో? ఇందువదన!
నీదు కరుణంపు దృష్టిని నిలుపుమమ్మ!
67 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

వివిధ క్షేత్రాల సత్కృప వెలసితీవు
శక్తి రూపాల జనులకు భుక్తి ముక్తి
నిచ్చుటకుగాన గొలుతురు నిందువదన !
68 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పరమయోగులు పుణ్యులు భవ్యమతులు
ఆ యగస్త్యుండు గొలిచెను ఆశతోడ
సకల లోకైక జననివి సాధువినుత !
69 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పచ్చ కర్పూరములతోను పాలతోను
మంచిగంధము తోడను మాత నీకు
జలకమాడింతు రమ్మరో ! జలజగంధి !
70 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

దేవి ! పెద్దమ్మ ! మాయమ్మ ! దేవదేవి !
తల్లులందరిలో పెద్ద తల్లి వీవె !
మేటి దేవత ! నీకిల సాటి లేదు
71 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అంబ ! దయజూపు సతతము నండనుండి
కాళహస్తీశు యర్ధాంగి కనికరించి
కోరినంతనె దీర్తువు కోర్కెలన్ని
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 72

భక్తి నీ పాదయుగళంబు పట్టినాను
మనసునందున నీ దివ్య మంత్రములను
జపము చేయుచునుంటిని శైలతనయ !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 73

అలరకైలాసమున నిండు కొలువులోన
పరముడా శంకరుని వామ భాగమందు
నిలచు కళ్యాణమూర్తివి నీవు కాదె
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 74



శ్రీ స్వర్ణ ముఖి నది తీరాన వెలిసిన శ్రీకాళహస్తీశ్వర క్షేత్రము

స్వర్ణముఖి తీరమందున సర్వులలర
పతితో వెలసితి వమ్మరో సుచరిత్ర !
నిన్ను గొలిచిన గాతువు నీరజాక్షి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 75

కాళహస్తి యందుండిన కలుగ వెపుడు
కాలు బాధలు తలపంగ ఖలునికైన
ముక్తిదాయిని ! జ్ఞానాంబ ! శక్తినిడుమ
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 76

బ్రహ్మ విద్యవు గాయత్రి ! బ్రహ్మవినుత !
భూరి విశ్వకుటుంబిని ! చారుకీర్తి !
నిన్ను వర్ణింప నేర్తురె నిఖిల జనులు ?
77 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అన్నపూర్ణవునై నీవు నన్నమిడుచు
జ్ఞాన భిక్షను పేడిన జ్ఞానమిడుచు
జనుల కాపాడు నా తల్లి వనజ నయన !
78 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అంబ ఆగమ శాస్త్రాల ననుసరించి
అగ్ని దుర్గగ జయదుర్గ లనగ వివిధ
రూపముల దాల్చు నవ దుర్గ రూపివీవె !
79 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అక్షరాత్మక సర్వబీజాక్షరములు
నీవె ! స్థావర జంగము నిచయమెల్ల
నీవె సామ్రాజ్య శాలిని వీవె తల్లి !
80 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

యజ్ఞ యాగాగ్ర పూజిత ! యజ్ఞ వరద !
తత్వమర్థస్వరూపిణి ! ధర్మనిలయ !
కోరి నీ దరి జేరితి కొనవె నుతులు
81 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

రమణి ! నీ పెద్దకొడుకు విఘ్నముల రాజు!
కూర్మి నీ చిన్న పుత్రుండు కొమరుసామి !
మగడు పరమేశ్వరుం డట్టి పొగడగలమె ?
82 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

మంచుకొండ కుమారివి మరకతాంగి !
సింహ వాహన మేపారు శివునిరాణి !
నగమునందు వసించెడి జగము తల్లి !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 83

జగతినంతను నిండెను జనని నీదు
శక్తి సామర్థ్యమెల్లను శంభురాణి !
సర్వశక్తుల నొసగెడి సౌమ్యరూప !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 84

విశ్వరూపంబు జూపిన వేళ సురులు
మూర్ఛ వోవగ నాదంబు మ్రోగజేసి
వేదములు గాచె వందురు వేదవిదులు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 85

శాంత రూపంబు శతకోటి కాంతు లమర
లీలలొనవ్వ తొలుకాడ మ్రోల నిల్వ
సన్నుతింపరె దివిజులు నిన్ను జూచి
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 86

రాజరాజేశ్వరీ దేవి ! రమణి ! బాల !
కనక దుర్గమ్మ ! శాంభవి ! కంబుకంఠి !
యఖిల రూపాలు నీవెగా నిఖిల జనని !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 87

మూడు వేళల పూజల ముదము తోడ
మేళతాళాలు మ్రోగంగ మీననేత్రి !
యందుకొనుచుందు వమ్మ మా కభయమీయ
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 88

లాలి నూచెద జ్ఞానాంబ జోలపాడి
ఊయలను బట్టి భక్తిమై నూపుచుందు
నిదురబోవమ్మ నిశ్చింత నిర్మలాత్మ !
89 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

భక్త బృందము వాకిట భక్తి తోడ
వేచి యున్నారు లేవమ్మ విశ్వమాత !
మేలుకొలుపుచు నుండిరి మేలుకొనవె !
90 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

నామకీర్తన జేయుచు నారదుండు
నిన్ను జూడను వచ్చిరి నిఖిల మునులు
మేటి సత్కృప మాతల్లి మేలుకొనవె !
91 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

సూత శౌనక సనకాది సకల మునులు
కాళిదాసాది కవులను కనికరించి
యభయమిచ్చిన కాళివి శుభగశీల !
92 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

కాళికాదేవి ! కరమున కత్తిబట్టి
నాలుకను జాచి జగమును నేలుదాన
భీకరాకృతి జూపకు భీతి గలుగు
93 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

సఫలమొందిరి నెందరో సాధుజనులు
ముక్తినొందిరి యెందరో మునులు సురులు
చెంత జేరితి జ్ఞానాంబ చింతదీర్చు !
94 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అంబ ! చాముండి ! శ్రీదేవి ! యార్తరక్ష !
యార్తులను బ్రోచు మాతవు కీర్తనీయ !
దుష్టులగు రాక్షసులనెల్ల దునిమినావు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 95

రమ్య మంగళ తూర్యంపు రవములెసగ
వరునితో గూడి దేవేంద్ర వైభవమున
చూడ్కులలరంగ కొండను చుట్టిరావె !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 96

అంబ ! శాంభవి ! శ్రీజగదాంబ గౌరి !
కాళి ! కాత్యాయినీ దేవి ! కనకదుర్గ !
వీణకరవాణి ! కళ్యాణి ! విమలచరిత !
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 97

పశుపతీశ్వరుడీశుడు ప్రక్కనుండ
నంకమందున తనయుండు నలరుచుండ
ముదముతోనుండు నిను జూడ ముచ్చటగును
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 98

వాహనంబుల మీద నా వాడవాడ
లరసి తిరుగుచు హారతు లందుకొనవె !
భక్తు లిడుచుండ శివరాత్రి పర్వమందు
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 99

పసిడి పావడ కట్టుక ప్రభలు మీర
మేలి బంగరు నగలును మేన గలిగి
నెన్నతరమౌన నీ రూపు నెవరికైన
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 100

పాలబడితిని పాలింపు పసిడి బొమ్మ !
యేల జాగొనరించెద ? వేల తల్లి ?
తాళ జాలను వినుమిది తగదు నీకు
101 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

పరగ కంఠమునందున పసిడి దండ
శిరమునందున మకుటము మెరయుచుండ
నభయ హస్తము జూపెడి యంబ వీవె !
102 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ఆశ్వియుజ మాసమందున నాద్యవగుచు
నవ విధంబుల రూపాల నవతరించి
భక్తజనముల గాచిన పరమ సాధ్వి !
103 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

ఘల్లు ఘల్లంచు పాదాల గజ్జె మొరయ
ముక్కునందున మెరసెడి ముక్కరయును
చూడ ముచ్చట రూపమ్ము చూపరులకు
104 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

సామ గాన వినోదినీ ! శంభురాణి !
రాగ తాళ వినోదిని ! రమ్యమూర్తి !
నాట్య నృత్త వినోదిని ! నాదరూప !
105 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

అంబ ! హ్రీంకార దర్పణమందు నుంట
శ్రుతులు దెల్పుచు నుండెడి సూక్తి యమ్మ!
యట్టి నిన్ను నెఱింగి నే పట్టగలనె ?
106 పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి !

కాళికా రూపమును దాల్చి ఖడ్గహస్త!
చామ ! ముప్వురు మూర్తులు జంపలేని
దనుజ వీరుల రణమున దునుమలేదె ?
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 107

స్వస్తి గౌరీమహాదేవి శంభురాణి !
మంగళంబగు గావుత మాత నీకు !
శుభము లగుగాక నీకెప్డు సుజన వరద!
పూని రక్షింపు జ్ఞాన ప్రసూన దేవి ! 108

